# విజ్ఞప్తి

సక్రమమైన సాహిత్యప్రపంచమును తొంగి చూచిన భాగ్యముకూడ లేని నావంటివాఁడు నాటకరచనమునకుఁ బూనుకొనుట సాహసమని యెఱిఁగియు, నీనాటకము వ్రాయుటకుఁ గలకారణములను మనవిచేసికొనుచున్నాను.

శ్రీవాల్మీకివిరచిత శ్రీమద్రామాయణమునందుఁ బరమేశ్వరుని నిర్హేతుకకరుణారసము ప్రవహించిన ఘట్టం మహాల్యాచరిత్రము. విశ్వామిత్ర వసిష్ఠాదిఋషులను, సుగ్రీవాదివానరులను, విభీషణాదిరాక్షసులను, జటాయువువంటి తిర్యగ్జాతులను నను గ్రహించినఘట్టములున్నను, వారికందఱకు శ్రీరామచంద్రమూర్తి యనుగ్రహము కలుగుటకేదేని యొక స్వల్పహేతువు కనఁబడుచున్నది. తుదకు శబరి శ్రీరామచంద్రునకు ఆతిథ్యమైన నిచ్చినది. కాని, అహల్య పరంధాముని స్మరించియైన నుండ లేదు. ఏలయన: భర్తృశాపోపహతయగు నామె జడత్వముఁ బొందినది. అనఁగా స్థావరములవలె నామెకు మనస్సు సత్తామాత్రమైనది. కనుక భగవానునికొఱకామె యెదురుచూచియైన నుండలేదని చెప్పవలెను రామాయణమునందాభాగము చదువునప్పుడు పరమేశ్వరుఁడు నిర్హేతుకజాయమానకరుణాసముద్రుఁడనుటకిది ప్రబలమైన సాక్ష్యమని నాకుఁ దోఁచినది. రామాయణమునందేఘట్టమునందును నాకుఁ గలుగని విశేషానంద మిది చదువునప్పుడు కలిగినది. ఆకథాసన్నివేశము నామన

శ్చితువునకుఁ దోఁచినరీతి నీనాటకమున వ్రాయుట యొక్క కారణము.

రెండవ కారణము:—అహల్య యింద్రునితో సమాగమము పాపమో పుణ్యమో విచారించినచో సిద్ధాంతము జేయుట మిగుల కష్టమని తోఁచినది. ఆవిచారమునందు నాకుఁ దోఁచినయంశముల ద్వితీయాంకము ప్రథమరంగమున నించుక వ్రాసితినిగాని, యది సమగ్రచర్చ కాదు. అంతకంటె ఆపాత్రలతోఁ జెప్పించుటకు నాకు ధైర్యము చాలలేదు. ఒక్కటి మాత్రము యోజింపవలసినయంశము భగవంతుఁడు చతుర్ముఖునిమానసమం దుద్భవమందిన యహల్యకు ధర్మేతరమగుకామ ముద్భవించునా యని?

మొత్తముమీద శ్రీరామచంద్రమూర్తి లీలావిశేషములయం దొక్కటియగు నీకథను నాటకముగా వ్రాయుట ఆత్మతృప్తియే ముఖ్యహేతువు.

ఈనాటకమునందలి తప్పుల దయతో దిద్దియిచ్చిన బ్రహ్మశ్రీ కావ్యపురాణతీర్థ విద్వాన్ జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారికి నాకృతజ్ఞతాపూర్వకవందనసహస్రములు.

మఱియు నీచిన్న నాటకమునకు నేనెట్లు పీఠిక వ్రాయవలయునా యని విసుగుగొనక దయతో పీఠికను వ్రాసియిచ్చిన ఆశ్రితకల్పతరువులును నిరుపమానతపోవిభవులును అభినవాంధ్రవాల్మీకులును నగు బ్రహ్మశ్రీ కళాప్రపూర్ణ జనమంచి శేషాద్రిశర్మగారికి నాసాష్టాంగప్రణతులు సమర్పించుచున్నాను.

ఇట్లు,

గ్రంథకర్త.

# తొలిపలుకు.

"అహల్య" యను నవ్యరూపకము మ-రా-శ్రీ, మల్లి బోయిన రామసుబ్బయ్యగారిచే రచింపఁబడినది. ఉపోద్ఘాతము వ్రాయఁదగుభాగ్యము నాకు లభించినది. గ్రంథకర్త ప్రాఁతకడప వాస్తవ్యులు. తెలుఁగు గ్రంథముల నోపికమైఁ జదివి చక్కని పాండిత్యము నేకలవ్యుని కరణి సంపాదించిరి. ఈకాలపుఁగథలు (నవలలు) వీరికంటఁబడ నివి యుండవని నానమ్మకము. అందు నుత్తమములఁ బలుసారులు పఠించి స్మృతిపథమున నుంచుకొనుట వీరి యభ్యాసము. ఈవిషయమంతయు నే ననుభవమున నెఱింగితిని. పెక్కుసారులు నాతో నీకాలపునాటకములచతురిమను వర్ణించిరి. వీరియాశయము లుదారములని వారిసంభాషణమునుబట్టి యెఱింగితిని. ఆయుదారాశయములను వెల్లడించు నుద్దేశముననే యహల్యయను నీరూపకమును వ్రాసిరని నాయభిప్రాయము.

నాటకము లుత్తమాశయములను దెలుపుచుండవలయు ననుట సర్వజనసమ్మతము. ఏభావమునఁ బాత్రప్రవేశము కల్పింపఁబడునో యాభావము తేటగ ద్రష్టలకు బోధపడవలయును. ఇందు ద్వితీయాంకము ప్రథమరంగమును బఠించిన గ్రంథకర్త యాశయము లెంత యుదారములో పాత్రపోషణమున నెంత శ్రద్ధాళువులో సరసమతులకు గోచరింపక పోదు. సాఖ్యమను

శబ్దమునకు నిర్వచన మీరూపకమునఁ గనంబడు. అహల్య యింద్రుఁడు సంభాషించుటలో నేభావమున వారు ప్రవర్తించిరో యనునది యుక్తియుక్తముగ నిరూపించి ధన్యుఁడయ్యెను. "స్వభావోదురతిక్రమః" యనునది యిందు సిద్ధాంతము చేయఁబడినది. ఇట్టి నాటకములే యాదర్శప్రాయములని నే నమ్ముచున్నాఁడను. నాటకము కడుంగడుం జిన్నదియే యైనను రసపోషణమునఁ గడుం గడుం బెద్దదని నిక్కమగు నాయాశయము. విశేషించి పెంచి వ్రాయుటకన్న నిరుపమానాశయభూయిష్ఠమగు నీరూపకమును బఠించు టుత్తమమని పాఠకమహాశయుల కెఱింగించుచు నిట్టి రూపకములఁ బెక్కింటిని గ్రంథకర్త రచించి సుత్తమోత్తమ నాటకకర్త యనిపించుకొనుఁగాక యని వారక కోరుచున్నాఁడను. కరుణానీరధి దాశరథి యీగ్రంథకర్త కాయురారోగ్యభాగ్య సద్బుద్ధులం బ్రసాదించుఁ గాతమని ప్రార్థించుచున్నాఁడను.

ఇట్లు కళాప్రపూర్ణ కావ్యస్మృతితీర్థ
జనమంచి శేషాద్రిశర్మ,
కడప.

# అంకితము.

జగము పావనమును జేయఁగఁ జాలినట్టి
యభ్రగంగావతార మెందయ్యె; మౌని
సతికి శాపంబుఁ బాపఁగాఁ జాలె నెద్ది
యట్టి శ్రీరాముపదసీమఁ కంకితంబు.

శ్రీరామాయనమః.

# అహల్య

## నాంది

ఉ. ఏయవతారమందయిన నిట్టి మహాద్భుతలీల లేదటం
చీ యఖిలావనిన్ విబుధు లెంతయు భక్తి నుతింత్రు దేని; నా
తోయజసంభవాదులును దోరపుభక్తిని గంద్రు దేని; నే
నాయవతారమూర్తి నెద నాదృతి మ్రొక్కెద రామమూర్తినిన్.

## ప్రథమాంకము - ప్రథమరంగము.

[మేరుపర్వతశిఖరాగ్రమున హిరణ్మయవినిర్మితవిశాలవేదికాతలంబున భారతీబ్రహ్మలు హంసవాహనారూఢులై దేవతలు ఋషులు పరివేష్టింప నుందురు.]

### భారతీబ్రహ్మలస్తుతి.

జయజయ శారద - జయచతురానన
జయజయ ధాతా - సరసిరుహాసన
శరణు మహాత్మక - సజ్జనపాలన
శరణనువారము - చదువులరాణిని

పాహి సరస్వతి - పరవాగ్దేవత
పాహి భారతీ-బ్రాహ్మీసేవిత
మిము దర్శించిన - మేలగుఁ బ్రాణికి
మముఁ గాపాడుఁడు - మనముల మఱువక
జగముల కెల్లను - జననీజనకులు
జగదుద్భవములు - సరి మీలీలలు
శ్రుతిసంఘాతము - స్రుక్కుచునుండును
నుతి మిముఁజేయఁగ - నోపనికతమున
జడులము మే మెటు - సన్నుతియింతుము
కడుదుర్బలులము - గాంచుఁడి కృప మము
భూతదయాళుర - భువనేశుల మిము
ఆతతభక్తిని - నారాధింతుము
సత్యలోక మే - సతతనివాసము
ప్రత్యక్షము మీ - పరమైశ్వర్యము
వాగర్థంబుల - వలె మీతనువులు
ఆగమతుల్యము - లనిరి మహాత్ములు.

బ్రహ్మ.—దేవర్షిగణములారా! మేమిందు విచ్చేసెదమని మత్సందర్శనార్థమై మీ రరుదెంచినకతమున సంతుష్టుల మైతిమి. మాదర్శనము ప్రాణిసంతతికి శుభప్రదంబు. అపూర్వంబును, మహనీయంబును, నగుస్త్రీరత్నమును సృజింపఁదలంచితిని. శ్రీమన్నారాయణునియనుగ్రహంబునను, ఈభారతీదేవిసహాయంబునను.

ఉ. మున్ను సృజింపఁగాఁబడిన మోహనదివ్యసురూపదేవతా
కిన్నరసిద్ధసాధ్యమునిఖేచరభూచరనాగకాంతలం
దెన్నఁడునైన నెచ్చటను నిట్టి మహాద్భుతసృష్టి లేదటం
చెన్నఁగ సర్వలోకములు నిప్డు సృజించెద నొక్కకామినిన్.

(క్షణమాత్రము ఎదుట దృష్టినిలుపును.)

[అహల్య ప్రవేశించి.]

ఉ. నీరజసంభవా! యఖిలనిర్జరవందితపాద! నీకు, నీ
హారపటీరహీరసుమహాసమానశరీరయైనమా
శారదకుం బ్రణామములు సల్పెద; సంతతభక్తలోకమం
దారులు మీకృపం గడును దారత నాయెడ నుంచి ప్రోవరే.

బ్రహ్మ.—పద్మాసను లిక్కన్యను విలోకింపుఁడు. నాగలిని హాల మందురు. హాలముభాగము హాల్యము (వంకర) ఇక్కన్య కామణియం దెచ్చటను నేవంకయు లేనందున, హాల్య రహితయగు నీమె అహల్యయని పిలువఁబడుఁగాక. మన్మానసోద్భవయగు దీనిపుణ్యవిస్తారుండగు తగినపురుషున కీఁదలంచితిని. అట్టివాఁ డీమె పాణిగ్రహణ మొనర్చుఁగాక!.

ఇంద్రుఁడు.—(లేచి చేతులు జోడించి) పరమేష్ఠీ! ఈమీపద భక్తునియెడ నితాంతకృపాపరుండవై, త్రైలోక్యాధిపత్యదౌరంధుర్యదివ్యపీఠంబున నిల్పితివి. చింతామణికల్పవృక్షనందనైరావతోచ్చైఃశ్రవంబు లాదిగాఁగల దివ్య

పదార్థంబు లొసంగితివి. అవియివి యన నేల. సౌఖ్యసాధ నంబులగు దివ్యవస్తువితానంబులెల్ల ననుగ్రహించితివి. ఇన్నింటను భవదీయకృపాపాత్రుండగు ఈశతక్రతుండు గాక, యీసౌందర్యరాశి పాణిగ్రహణార్హుండు వేఱొక్కం డెవ్వఁడు ? ఈలలనారత్నంబుచే స్వర్గంబును దదధిపతియు నలంకరింపఁబడున ట్లనుగ్రహింప వేఁడెద. అట్లైన నీలలనయు సర్వాదత్త యగును. దేవరచిత్తము. (కూర్చుండును)

గౌతముఁడు.—(లేచి యంజలిఘటించి) పితామహా! కొండొక కాలముననుండి నన్నొక్కకోర్కె బాధించుచున్నది. బ్రహ్మచర్యంబును వీఁడి గృహస్థాశ్రమంబుఁ జేకొన నెంచితిని. "పుత్రేణ లోకాఞ్జయతి" యనెడి భవదీయవాక్యం బగు వేదాదేశంబునఁ గర్మతంత్రుండనై పుత్రవంతుం డఁగా నెంచితి. జగత్స్రష్టవగు నీకు సృష్టి ధర్మమైనట్లు నీబిడ్డల మగుమాకును బరమధర్మమై యున్నది. దేవర యనుగ్రహించి యిక్కన్య నొసంగినఁ గృతార్థుండ నగుదును. (కూర్చుండును)

తక్కినసభ్యులు.—సర్వేశ్వరా! సత్యస్వరూపా! ఇక్కన్యారత్నమునకుఁ దగినవరుఁ డెవ్వఁడని తోఁచునో యాతని కనుగ్రహింపుఁడు. కించిద్జ్ఞులమగు మాయభిప్రాయముల్ లేల ?

బ్రహ్మ.—మంచిది. ఇక్కన్యను పరిగ్రహించువాఁడు భూరి పుణ్యోపేతుఁడై యుండవలెను. భూప్రదక్షిణము మహా పుణ్యప్రదము. ఎవ్వండేని భూప్రదక్షిణ మాచరించి మునుముందు మాసన్నిధి కేతెంచునో యాతఁడు దీని పాణిగ్రహణంబున కర్హుండు. వలయువారు ప్రయత్నింపుఁడు.

ఇంద్రు.—(ఆత్మగతమున) వాయువేగమనోవేగములమించు త్వరితగమనంబుగల ఉచ్చైఃశ్రవంబు మదధీనంబై యున్నది. ఈపరీక్ష విచారింప బ్రహ్మ యిక్కన్య నాకియ్యఁదలంచినట్లె తోఁచుచున్నయది. ఇదియును నాకు మంచిదే. (ప్రకాశముగ) దేవా! దేవేంద్రుఁ డిదే ఏతత్కార్యసాఫల్యమునకై బయలుదేరుచున్నాఁడు. (నమస్కరించి నిష్క్రమించును)

గౌత.—(ఆత్మగతమున) ఈఇంద్రుని దౌష్ట్య మేమనవలయును! వేనవేలు అచ్చరలును నూర్వసియు శచియుఁ జాలక యిక్కన్యకూడఁ దనకే కావలయు ననుచున్నవాఁడు. వీఁడు తనకుచ్చైఃశ్రవంబుగలదని మిన్నుముట్టుచున్నట్లున్నది. వీనికి గర్వభంగంబుగను నిక్కన్యాలాభంబు నకునుగా నొకయుక్తిం బన్నెద. (ప్రకాశముగ) నేనును బ్రయత్నింప ననుజ్ఞాతుండను. (నమస్కరించి వెడలును)

భారతీబ్రహ్మలును దేవతలును దక్కినవారును నట్లె యుండ. గౌతముఁడు ప్రవేశించి భారతీవిధాతలకు

నమస్కరించి) దేవా! నేను భూప్రదక్షిణ మాచరించి వచ్చి తొలుత భవదీయదివ్యచరణసాన్నిధ్యంబుఁ జేరితిని. పిమ్మట దేవరచిత్తము.

(దేవతలును ఋషులును నాశ్చర్యమునఁ జూచుచుందురు అహల్య యించుక మ్లానవదన యగును—దేవేంద్రుఁడు ప్రవేశించి)

ఇంద్రు.—లోకేశ్వరా! నే నిదే పుడమి ప్రదక్షిణ మాచరించి తొలుత దేవర శ్రీచరణారవిందములకడఁ జేరితిని. ఇకన్య ననుగ్రహింపుఁడు.

(అహల్య యించుక సంతోషసూచిత యగును.)

బ్రహ్మ.—దేవరాజా! తొందరపడకుము. అటుచూడుము. గౌతముఁడు నీకంటె మున్నే యరుదెంచి "భూప్రదక్షిణ మాచరించితి" నని వచించెను. దాని కేమందువు?

ఇంద్రు.—(సాశ్చర్యముగ) పితామహా! గౌతముఁడు మృష లాడుచుండనోపు. కాదేని పుడమిప్రదక్షిణ మాచరించు తఱిఁ జూచితిని. నేనుదప్ప నొరు లెవ్వరును ఏతత్కార్యా రంభులైనఁ గాలేదు.

గౌత.—దేవశ్రేష్ఠా! ఈదేవరాజు వెఱ్ఱివాఁడు. సర్వసాక్షియగు దేవరయెదుట మృషలాడుదునా? నే నీగిరిశిఖరినుద్ద మించుతఱి గోమాతంగని దానికిఁ బ్రదక్షిణ మాచరించి వచ్చితిని "భూప్రదక్షిణమును గోప్రదక్షిణంబును నొక్క

టియే” యనియును “భూమి గోరూపిణి” యనియు దేవర సత్యలోకమున గోమహిమంబు వాక్రుచ్చుతతి సెలవిచ్చితిరి. ఆమ్నాయస్వరూపులరగు దేవరవారు మరచియు నసృతంబు పల్కరు, గాన, దేవేంద్రుడును, నేనును, భూప్రదక్షిణ మాచరించినవారమైతిమి. అయిన నేను దొలుదొల్త దేవరసన్నిధి కేతెంచితిని. మీరిందు దమదివ్యచిత్తంబున కెద్ది యుక్తంబని తోచునో యదియ కర్తవ్యంబు.

బ్రహ్మ.—గౌతమా! నిజమాడితివి. భూమికిని గోవునకును భేదము లేదు. ఈవిషయమున నీవు విజయుండవైతివి. అహల్యను నీకిచ్చితిని. బరిగ్రహింపుము. (అహల్యను జూచి) కుమారీ! గౌతముని ధర్మపత్నివై వెలయుము. (అహల్యాగౌతములు నమస్కరింతురు.)

దేవర్షిగణములారా! మీమీ నివాసంబుల కరిగి సుఖంబున నుండుడు. ఇంద్రా! నీవును నీనికేతనంబున కరిగి శచీప్రముఖదేవాంగనాబృందంబుతో సుఖంబున నుండుము.

(అందఱును నిష్క్రమింతురు.)

భారతి.—నాథా! మీలీల లవ్యక్తములు. పాపము! ఇంద్రుడు మీచే వంచితుడుగా లేదా? వానికి గోప్రభావంబు తెలిసియుండదు. తెలిసియుండెనేని భూప్రదక్షిణప్రయా

సము లేకయే గో ప్రదక్షిణముఁజేసి అహల్యాపాణిలాభ
మును బొందియుండును.

బ్రహ్మ.—దేవీ! ఇంద్రునకు గో ప్రభావంబు తెలియకపోవుట
నాతప్పెట్లగును?

భార.—పోనిండు. సుందరసుకుమారతనులతాంగియగు నహ
ల్యను సృజింపనేల? సృజించితిరిపో. దాని కనురూపమగు
స్వర్గసౌఖ్యంబునీయక, కందమూలఫలాశనులగు ముని
కుటీరముల కేల యంపితిరి? పురుషు లతికఠినులు.
మీకార్యములు మీకే సమంజసములుగ నుండును.

బ్రహ్మ.—దేవీ! సుఖదుఃఖములు ప్రాణికోట్లకర్మానుసారము
వారికిఁ బ్రాప్తించుచుండ నేను నిమిత్తమాత్రుండనని
తెలిసియు, సర్వజ్ఞవగు నీవును నిట్లనుచున్నదానవు.

భార.—అది యట్లుండనిండు. అహల్యకు దేవేంద్రుఁడే తగిన
వాఁడు. (అర్థోక్తియందే బ్రహ్మ భారతీదేవి చుబుకము
నంటి) ఆగు మాగుము దేవీ! చాలును మదీయఘటనా
సూత్రమునందు ఒకనికి భార్య యగువనితను మఱొక్క
నికిఁ దగునంటివి. వాగ్దేవతవగు నీ విట్లనుటచే భవిష్య
త్కాలగర్భమున విచిత్రసంఘటనాంకురం బేర్పడినది.
ఇప్పు డావిషయమేల? మనము సత్యలోకమున కరుగు
దము రమ్ము.

(నిష్క్రమింతురు)

---

## ప్రథమాంకము - ద్వితీయరంగము

మేరుపర్వతమున మఱియొకభాగము

(దేవేంద్రుఁడు ప్రవేశించి ఆత్మగతమున) ఆహా! ఆసలు మొగంబులముదుసలి నన్ను వంచించెను. ఆతఁడు తలచు దేవతలకంటె ముదుసలులగుమునులపక్షంబుననే యుండును; కాదేని, శ్రమకోర్చి మహాగమనంబున భూప్రదక్షిణ మాచరించివచ్చిన నన్నుగాదని గోప్రదక్షిణ మాచరించెనని గౌతమున కాగజగమన నొసంగి గౌరవించెను. ఔరా; గోప్రదక్షిణమును భూప్రదక్షిణముళు నొక్కటియేయఁట. అట్లగునని తెలిసియుండిన అందఱును గోప్రదక్షిణముఁజేయరా? అది యొకమహాకార్యమా? ఇదియంతయు అమునిముచ్చు కోరెనని అహల్య నాతనిపాలఁబడవైచుటకుఁ బన్నినకుతంత్రము గాని వేఱుగాదు ఇదియంతయు లేకున్నే గౌతమున కాకన్య నిచ్చెదనన్నఁ దనను గాదనువా రెవరు? ఔరా! గౌతఁము డెంతటి దురహంకారి! మొదటనే కాంక్షించి యర్థించినకన్యను తనకిమ్మని యడుగుటయేఁగాక నాకుఁ బ్రత్యర్థిగఁ బందెమునకుఁగూడ నిలిచెను. కానిమ్ము చూచెదఁగాక! (ఇంచుకసేపు యోజించి) ఆహా! ఏమా దివ్యసౌందర్యము! గౌతమునివెంటనంటి యరుగునపుడాచంచలాక్షి తనకటాక్షాంచలము నాపైఁ బరఁగించుచు నామునివెంట నరుగ నిష్టములేనిదియునుబోలె నరుగ

నప్పటి యామాభ్రులు మన్మథునితూఃపులై నాహృదయ మున గాఢముగ నాఁటియున్నవి. పాప మాయబల మొదలు నను సానురాగముగఁ దిలకించుటయుఁ దుదకు గౌతముఁడు విజయోపేతుఁ డాయెనన్న మోమున విన్నఁ దనంబు నొందుటయుఁ జూడ నాయం దామచ్చకంటిమాన సము ప్రేమబద్ధమైనదని రూఢియగుచున్నది. అయిన నిఁక నేమిచేయనగును. అయినదేదో అయిపోయినది. గౌతముని ధర్మపత్నియగుదాని. గుఱించి చింతించుటకైన నాకధికార మెక్కడిది? తలపోసికొనినను ధర్మహాని. ఆతలంపైన నామానసమం దుంచుకొనరాదు (తలవాంచి యించుక చింతించి) ఔరా! ఆమధురవిగ్రహము, మరచి పోవుదమన్నను మరపురాకయున్నది అర్థేందుఖండంబు నపహసించు విశుభ్రఫాలతలంబును, మందమారుతచల నంబున నృత్యమునలుపు ముంగురులును, లలితంబై, పద్మ రాగసమానారుణభాసురంబై, నొక్కిన నమృతంబు స్రవించునో యననొప్పు నాయధరంబును, విభ్రమ విలాసభాసురంబులును, త్రిలోకవశీకరణసమర్థంబులును, మోహానమంత్రాధిదేవతాహస్తస్థితమయూరపింఛవినిర్గత పురుషపారవశ్యకరణ ప్రతిష్ఠితప్రభావీచికలనందగిశవియు నగు; యాలోచనాలోకనంబుల మఱచుటెట్లు?

సీ. శృంగారరసమహాసింధు వందు విధాత
లలితకళాకౌశలాభిరామ

మహనీయబుద్ధిచేఁ ద్రచ్చ మథనం బొనర్పంగ
నంగనాకృతిసుధ యవతరించెఁ
గాఁబోలుఁ! గాకున్నఁ గడలిఁబుట్టినయట్టి
యప్సరోజనుల కెంతైన నిట్టి
దివ్యసౌందర్యంబు దిలకించినది లేదు,
పరమాద్భుతంబయి పడతి యొప్పె,

తే. నట్టిసతిఁ బొందఁజాలనియధమునకును
నేల యమరాధిపత్యంబు, యేల భోగ,
మేల, నందనకల్పక, మేల సర్వ
వస్తువితతి, దలంపంగ వ్యర్థ మకట!"

సర్వమును వ్యర్థము. ఈజీవితమే వ్యర్థము. నారాయణుని యూరుసముద్భవ యగునూర్వసియు నన్నాళీకనయన నఖాగ్రంబునకేని దీటుగానేరదు. ఆశశివదనసాన్నిధ్యంబున శచీదేవిసహితము ఖరఖరునిముందటిఖద్యోతసమానము. సీమారహితశృంగారరసార్ణవంబగు నాసుశ్రోణిసురత సౌఖ్యంబు చూరఁగొనక సురలోకనాథునకు సుఖంబు గలదే చూచెదఁగాక.

(నిష్క్రమించును.)

---

## ద్వితీయాంకము - ప్రథమరంగము.

గౌతమాశ్రమమునందలి కాసారతీరప్రదేశము
అహల్య ప్రవేశించును.

(స్వగతము) ఆహా! ఈవసంతకాలము నాకే యింత నయనానంద కరంబగుచుండ అనురూపవయోవతులగు దంపతుల కెట్లుండునో గదా? కాలము పరువిడుచున్నది. తరులతాదులు కిసలయకుసుమఫలభరితంబు లగుచు లోకము నానందింపఁజేయు వసంతదినంబు లెన్నిమారులో వచ్చుచుఁ బోవుచున్నవి. ఛిద్రభాండజలంబుపగిది యౌవనము వ్యయమగుచున్నది. (యోజించి) నాఁడు జరిగినవిషయము నేఁడు జరిగినట్లె నామనోనేత్రమునకు గోచరించుచున్నది. సర్వగీర్వాణవల్లభునంతటివానికినిఁగూడ నాఁడాస్వల్ప విషయము తోఁచకపోయియుండుటచేతనే యింతవఱ కిట్టు పరిణమించుట, అతఁడును ఒకగోప్రదక్షిణ మాచరించి యుండెనేని జరిగినవసంతవాసరంబులు నాకును నానంద దాయకములై యుండియుండును. పాప మాయింద్రుఁడు నాపాణిలాభమునకై ప్రయాసపడి పుడమిని బ్రదక్షిణ మాచరించివచ్చెను. అయిన నేమాయె? విధి వేఱుగాఁ దలఁచెను చిరకాలగతంబగు నావిషయము నేఁడు నామనంబునఁ బునఃపునః ప్రత్యక్షంబగుచు నన్నత్యంతంబు నలజడిఁ

బెట్టుటంజేసి నాహృదయము శాంతికి దూరమగు చున్నది. ఈవిచారముచే నేను కళంకిత నగుచున్న దాన నేమో! ఏల? కళంక మెందులకు? వాయువు వీచుటయుఁ, బుష్పములు పరిమళించుటయు, జలము ప్రవహించు టయు, మిళిందకుమారుండు పద్మమరందంబు గ్రోలు టయు, జీవనికరంబు సర్వప్రాణిసాధారణధర్మమగురతియం దిచ్ఛగలిగి ప్రవర్తించుటయు, నపరాధమేని? పాపమేని? నిదియును నపరాధమే యగును. (ప్రక్కనఁ జూచి) ఓవి ధాతా! నీసృష్టిని దిలకింపుము. అదిగో ఆరాయంచజత నర యుము. ధర్మశాస్త్రార్థలోహమయనిగళబద్ధంబులుగాక, స్వేచ్ఛానందడోలికల నూగుచున్నవి. నీమానసపుత్రి నగునాకును, విజ్ఞానోపేతు లనిగర్వించు నీమనుజసంఘంబు నకును ఆమహాప్రసాద మెక్కడిది? హృదయము తపించు చున్నది. మర్మాంతికమగు నీహృదయస్థితి నెవ్వరికైన వెలిపుచ్చినఁ దాపోపశమనమగునేమో? అయ్యయ్యో! నేనెంతవెఱ్ఱిదానను. నాహృదయోద్దేశ మీమానవ సమాజమున మిగుల దూష్యముగనున్న దిగదా? ఛీ ఛీ! యీసంకల్పము హతమొనర్పవలయును. కాదేని నాకు శాంతియే యుండదు. ప్రభావరియు ఆశ్రమమునలేదు. ఆశ్రమమునకే పోయెదను (వెనుకకు తిరిగి నడువఁబోవ ప్రభావరి ప్రక్కనఁ గనఁబడును. అహల్య విస్మయ ముతో) ప్రభావరీ! ఎప్పుడువచ్చితివి?

ప్ర.—ఇప్పుడే యిక్కడికి వచ్చితిని. మీరు పరధ్యానమునుండి నారాక యెఱుంగరైతిరి.

అహ.—అవును చెలీ! నిజము నేనేదో యొకవిషయమై చింతించుచునుండి నీరాక యెఱుఁగనైతిని నీవు విశ్వామిత్రుని యాగశాలనుండి ఆశ్రమమున కెప్పుడు వచ్చితివి?

ప్ర.—ఇప్పుడే వచ్చి ఆశ్రమమునఁ బ్రవేశించి చూచితిని. మీరందు లేకుండుటచే నిచ్చట నుందురని మిమ్ముఁ బ్రథమమునఁ జూచినతరువాత నాకుటీరమున కేగనెంచితిని.

అహ.—ప్రియసఖికి నాయం దపరిమితమగుప్రేమ.

ప్ర.—అహల్యాదేవిని జూచినవా రామెను బ్రేమింపక యెట్లుండఁ గలరు? పోనిమ్ము. మహాదేవిని గలవరపెట్టువిషయ మేదియో తెలిపిన మీకుఁ గొంత యూఱటకలుగు నేమో?

అహ.—అదియేమియును లేదు. చాలకాలముక్రిందట నొకానొక విషయము స్మృతిగోచరమైనదానిని జింతించుచుంటిని; దానికేమి నీప్రయాణవార్తలేమైనఁ జెప్పుము.

ప్ర.—మీదేవరహస్యమును నాకుఁ జెప్పవలదు. లెండు.

అహ.—సఖీ! దేవరహస్యమన్న జ్ఞప్తికివచ్చెను. విశ్వామిత్ర దత్తంబగు హవిర్భాగంబులు గొన దేవబృంద మరుదెంచెనా? దేవరాజును విచ్చేసెనా?

ప్ర—రాకేమి? ఉగ్రతపోధనుండగు విశ్వామిత్రునియాహ్వాన మంగీకరింపకయుండ సురపతికైన సాధ్యమా? అతఁడు దివ్యవిమానారూఢుఁడై దేవతలును నప్సరోగణంబులు గొలువఁ జనుదెంచియుండెను. దేవీ! ఆవైభవము గణనాతీతము.

అహ.—ప్రభావరీ! నీవు మిక్కిలి ధన్యురాలవు. దేవపతి దివ్యదర్శన మబ్బినది. శతక్రతునియర్ధాంగి యగుట శాశచీదేవి యెంత పుణ్యముఁజేసికొన్నదో! పూర్వజన్మకృతపుణ్యరాశి ఫలోన్ముఖముగాకున్న సర్వగీర్వాణవల్లభుని పరిష్వంగసౌఖ్య మబ్బునా?

ప్ర—దేవీ! ఆసౌఖ్యప్రసక్తి మనకేల? పతివ్రతలకుఁ బరపురుష వర్ణనము నిషిద్ధము. ప్రసంగాంతరమునకు మరలుదము.

అహ.—ఓహో! నీవేమనుచున్నావు? పరపురుషవర్ణనమనియా? చాల పొరపాటుపడుచున్నావు. అనాదియు, అవినాశియు, నగువేద మెవ్వనిగురించి ప్రవర్తించుచున్నదో యాగాదిక్రతువితాన మేయింద్రనామక దేవతాసంతుష్టిచే ఫలప్రదములగుచున్నవో యట్టి త్రిలోకేశ్వరునిఁ బొగడుట దోషమా? ఎట్లో చెప్పుము.

ప్ర.—ఇంద్రస్తుతి దోషమని చెప్పలేదుగాని ఇంద్రుఁడు భోగాధికారియనియుఁ మహైశ్వర్యవిలాసుఁడగు నాతనిచెలిమి

సుఖావహమని తలంచుటగాని, శీలవతులగుసాధ్వులకు తగదేమో యని యట్లంటిని.

అహ.—ఏల తగదందువు. సర్వేశ్వరుని సంతుష్టునింజేసి దేహా నంతరమున స్వర్గమునుజేరి, సర్వసౌఖ్యంబుల ననుభవించుటకేగదా ? విజ్ఞానధురంధరులని పేరుగన్న విప్రులును, స్థితబుద్ధు లనందగిన యీఋషిపుంగవులును, శరీరసౌఖ్యంబులవీడియు, వ్రతనియమానుష్ఠానంబులచేఁ గాయక్లేశంబులకోర్చియుఁ, బదార్థవ్యయంబు గణింపకయు యజ్ఞాదులంజేయుట. ఈకర్మకలాపంబున కంతకును సారాంశ మమరవల్లభుని సంతుష్టునింజేసి యతని కృపాలబ్ధంబగు దివ్యసౌఖ్యంబు ననుభవించుటయేగదా ? స్త్రీలకు వేదాధికారము లేదనిరి. వీరు యాగాదులకు ననధికారులనిరి. అట్లైన స్త్రీలు వారిసౌందర్యవిలాసవిభ్రమంబులచే దేవపతి నాకర్షించిరో ? అతఁడే స్వయముగ. వారి ప్రణయ సౌఖ్య మర్థించిననో నతనిసంతుష్టునిజేయుట యాగాది కర్మమార్గమున సంతుష్టునింజేయుటకంటె ఘనతరపుణ్యప్రదముగాదా ? కర్మమార్గములు వివిధములైనను దేవతా సంతుష్టియే ప్రధానము. భిన్నభిన్నములగు నేతత్కార్మము లన్నింటికి నింద్రదత్తభూరిసౌఖ్యం బనుభవించుట యొక్కటియేఫలము. సౌఖ్యసాధనములగుకర్మమార్గములు పలువిధములైనను దుదకు సుఖానుభవము సమానముగదా ?

ప్ర.—మహాదేవి వచియించువిధానము మహాత్ములగువారు విచారించి సిద్ధాంతము చేయవలసియున్నది. ఇంద్రదైవత ప్రీతికొఱకు వేదము వివిధములగుకర్మమార్గములఁ జూపుచున్నది. అందేమార్గ మనుష్ఠించినను సవ్యమగును గాని, వేదచోదితముగాని నీచెప్పువిధానము పూజ్యమైన దని చెప్పనగునా ?

అహ.—వెఱ్ఱిదానా ! మానుషముకంటె దేవత్వ మన్నివిధముల పూజ్యము. దేవతావల్లభత్వ మంతకంటెను బూజ్యము. మనుష్యశరీరధారియగు జీవుఁడు ఈమనుష్యదేహమును వీడినపిదప దైవసంపదనొందుట కనువగుకర్మ యేదియో యది మనుజశరీరధారియై యుండునపుడే చేసెనేని యట్టివాఁడు కృతకృత్యుఁ డని వానిస్మృతి కొనియాడుచున్నది. మనుజదేహవిధ్వంసనము గాకమునుపే యతఁడు దివిజత్వసిద్ధినొందెనేని యతనిగుఱించి మఱి చెప్పవలసిన దేమున్నది?

ప్ర.—పరపురుషసంగమమునఁ బాపము సిద్ధించునని స్మృతులు నుడువుచున్నవి. దీనికేమందువు ?

అహ.—మంచిప్రశ్న. పాపమనఁగా నేమో మొదట నీకుఁ దెలియునా ? చెప్పెదను వినుము. పాపమన, నీవాచరించు కర్మవలన నీశరీరాంతఃకరణములకు మాలిన్య మొదవుట పాపము. అట్టిఫల మేకార్య మాచరించుటచేఁ గలిగెనో

యది పాపకార్యము. దేహేంద్రియాంతఃకరణములకుఁ దేజమును, శక్తిని,నిర్మలత్వము గలిగెనేని యది పుణ్యము. ఈఫలప్రసాదిని యగుకార్యము పుణ్యకార్యము. ఇంద్రుఁడు సంతసించెనేని దేవత్వ మొసంగఁగలఁడు. పుణ్యఫలప్రదాతయగు నాతనిసంయోగము పుణ్యమో? పాపమో? యిప్పుడు నీవే చెప్పుము పరుసవేదిసంయోగమున నినుము బంగారమౌట జాతిసాంకర్యమా? ఇనుము చెడినదా? దానికిఁ బాప మొదవెనని చెప్పఁగలవా? (నవ్వుచు)

చ. తపము తపం బటంచు నిలఁ దాపమునొందెడితాపసేంద్రులే
యపగతప్రాణులైనతఱి నావిబుధాలయమందుఁ జేరి య
చ్చపలమృగీవిలోచనలసమ్మతి నుంట ఫలంబె; గాన మా
కపరిమితానురక్తి విబుధాధిపుఁ బొందుట దోష మెట్లగున్.

పిచ్చిదానా! ధర్మరహస్యంబులు సామాన్యులకు దురవగాహంబులు. చెప్పుము చెలీ! ఇప్పు డేమనెదవు. అమరవల్లభునకు వల్లభయగుట తప్పా? ఒప్పా? చెప్పుము.

ప్ర.—అమ్మా! క్షమింపుము. నీవు బ్రహ్మమానసపుత్రివి. వివేకధురంధరురాలవు. పరమతపోధనుఁ డగుగౌతముని ధర్మపత్నివి. ఇట్టి నీయెదుట ధర్మరహస్యములు చర్చింప నే నెంతటిదానను.

(తెరలో ఓహో ప్రభావరీ! గురుదేవునిసాయంకాల పూజావిధానమునకుఁ బుష్పములు సేకరించి అగ్నిహోత్ర గృహమున నుంపుము)

ప్ర.—దేవీ! నేను సెలవుతీసికొనెదను, వేళయైనది.

అహ—మంచిది నేనును ఆశ్రమమునకు వెళ్లుచున్నాను.

(నిష్క్రమించును.)

ప్ర.—అహా! ఈమెమాటలుచూడ విచిత్రముగ నున్నవి. వేద శాస్త్రములకు విపరీతార్థము కల్పించుచున్నది. గురుదేవుని చేతులయందుఁ బెరిగి పెద్దదాననైన నీమెకు బుత్త్రీసమానురాలను. అట్టి నాతో నిట్టి ప్రసంగముచేయుచున్నది. ఇంద్రుఁడీమెయం దనురక్తుఁడని కర్ణాకర్ణిగ వినియుంటిని ఈ మెకును నట్లేయున్నది. ఏమికానున్నదో! పుష్పములు తీసికొనిపోయెదఁగాక!.

(నిష్క్రమించును.)

---

## ద్వితీయాంకము (ద్వితీయరంగము)

[ఇంద్రుఁడు ప్రవేశించి]

ఓహో! ఇదియే నానావిధపాదపపల్లవప్రసూనఫలశోభితంబును, కలహంసకారండవక్రౌంచజలపక్షివితానవిహారోపేతకమలకల్హారపరిశోభితకాసారయుతంబును, వివిధపుష్పవినిర్గతమకరందరసాస్వాదనోన్మత్త మధుపఝుంకార

నినదబహుళంబును, ప్రశాంతంబును లోకాతీత సౌందర్యసౌకుమార్యాద్యుత్తమలక్షణోపేత యగు నహల్యానివాసభాగ్యసంపన్నంబును నగుగౌతమాశ్రమంబున కరుదెంచితిని. (యోజించి) విభావరి యామత్రయంబతిక్రమించునంతదనుక నిందే యదృశ్యుండనై యుండెద. ఈలోన మద్భాగ్యవశంబున నహల్యాదేవి గనఁబడినఁ దదీయసౌందర్యామృతమును నేత్రపాత్రంబులఁ దనివి దీఱఁ ద్రావి సుఖించెద. గౌతముఁడు స్నానార్థమై నది కేగునదనున ఆశ్రమంబుఁ బ్రవేశించెద. (నిష్క్రమించి తిరిగి యరుదెంచి ఆకసమున దృష్టినిడి వినుట కభినయించి) గౌతముఁడు నిద్రలేచి స్నానార్థమరుగుచున్నట్లున్నది. ప్రభాతసమయసముచితమంత్రంబు లధ్యయనముఁ జేయుచుఁ జనుచున్నవాఁడు. ఇంచుక యాలసించి యాశ్రమంబు ప్రవేశించెద. (యోజించి) నానిజరూపంబునఁ బ్రవేశించిన ఎవ్వరైన ఆశ్రమవాసులు చూచిరేని రహస్యభంగంబు వాటిల్లు. అహల్యచిత్తవృత్తి నరయక మన్మనోభీష్టంబు దెల్పినఁ బ్రమాదము సంభవించునేమో? ఆనాఁడు గౌతమునివెంట నరుగునపు డమ్మత్తకాశిని ప్రణయగర్భితంబగుచూడ్కి నాపైఁ బరగించుచు నమ్ముని వెనుక నిష్టము లేనిదియునుంబోలె మోమున విషాదంబు దోఁపఁ జనియె. స్త్రీలచిత్తవృత్తి నరయ నంతియేచాలును. పురుషులవలెఁగాక స్త్రీలు ప్రియులకుఁ దమప్రేమను

విలాసవిభ్రమాదులచేఁ బ్రకటింతురు. అయినను, బహు కాలంబగుటకతనను, గౌతముని చిరపరిచయంబునను నిప్పటిచిత్తవృత్తి యెట్లుండునో యని శంకించెద. కనుక నిజరూపంబునఁ జనక గౌతమరూపంబునఁ జని యామెచిత్తం బెఱింగి నిజరూపంబు ప్రకటించెద. అదియె లెస్స. ఇంత కాల ముపేక్షించియుండుట నాదేతప్పు. క్రమ మని యక్రమంబని కర్తవ్యాకర్తవ్యజిజ్ఞాసం జిక్కి విలంబనం బొనరించితిని ఇంతకును గారణ మానలు మొగంబులముదుసలి. అహల్యను సృజించిననాఁడె నాకిమ్మని యెంత ప్రార్థించినను వినక, కల్పవృక్షప్రసూనధామంబు కపికంఠంబున వైచినట్లు అనవశిరీషకోమలాంగి నీజడదారి వాతఁబడవైచెను అనవరతవాతాంబుపర్ణాశనులై సోకిన బూచువలె శిథిలమగు నామునికేల యీవిద్యుల్లతా విగ్రహ యని తలంపఁడాయెను ఈమునికైనను నావి చక్షణజ్ఞానములేదు. మునులు దురాశాపీడితులు. దుష్టకోపనులు. తపోధన మున్నదిగదా యని దేనికిని శాపాయుధహస్తులగుదురు. కానిమ్ము. ఇఁక నొక్కముహూర్తమైన యహల్యాపరిరంభణేచ్ఛ యడిమియుంపఁజాలను. మొన్న విశ్వామిత్రునియాగవాటికయందలి మునిపత్నులనెల్లఁ గలయంజూచితిని. అందు మచ్చిత్తాపహారియగు యహల్య కనఁబడదయ్యె. నాఁటినుండియు నాచిత్తంబు నాయధీనంబు తప్పియున్నయది. ఇంకఁ బోయెదఁగాక!

(నిష్క్రమించును.)

---

## ద్వితీయాంకము - తృతీయరంగము

గౌతమాశ్రమము.

(ఇంద్రుఁడు గౌతమరూపమునఁ బ్రవేశించి ద్వారముకడ నిలిచి) జయ! రతీనాథునకుఁ జయ!

అహ.—(లోపల) ఇదియేమి చిత్రముగానున్నది రతీనాథునకు జయమనుచున్నారు. (ప్రవేశించి చూచి చిఱునవ్వుతో) నాథా! స్నానార్థమై చనినవారేల మరలివచ్చితిరి. రతీనాథవైరికి మారుగ రతీనాథునకే జయమనుచున్నారే?

ఇంద్రుఁడు—సాకసాక్షీ! భవదీయకృపాకటాక్ష వీచికామృత ప్రవంతి నవగాహనముఁ జేయఁగోరు నాకు నభ్రగంగావగాహనంబైన రుచియింపదయ్యె. అబలా! మఱికంబాది మధువైరిపఱికునుగల సకలచేతనులును భగవానుండగు మత్స్యధ్వజుని భక్తులయియేగదా నిర్భరానందడోలికల నూగుచు నతని నారాధించుచున్నారు అతనికిఁగాక జయము మఱెవ్వరికి!

అహ—(ఆత్మగతమున) ఇదియేమి వింతగానున్నది "అభ్రగంగావగాహనమఁట" "రతీనాథు నారాధించుటయఁట" ఈతని వైఖరిఁజూడ నాభర్తగాదని తోఁచుచున్నది. ఎవరో దేవపురుషుఁ డీరూపమున వచ్చియుండునా? పరీక్షించెదఁ గాక! (ప్రకాశముగ) నాథా! అయిన నీప్రభాతకాలమున మన్మథప్రసంగ మేల?

దేవే.—దేవీ! నిన్ను గూడి మన్మథు నారాధించుటకే. అతని భక్తులకుఁ గాలనిరీక్షణము లేదు.

అహ.—ఇది ఋతుకాలము గాదని యెఱిఁగియుఁ బరమనైష్ఠికు లగు మీరేల యిట్లనుచున్నారు.

ఇంద్రు.—సౌందర్యాధిదేవతా! పుత్రార్థుఁ డగువాఁడే ఋతుకాలనిరీక్షణముఁ జేయును. రత్యానందానుభవాసక్తచిత్తులకు ఋతుకాలనిరీక్షణ మేల? ఐరావతకుంభికుంభోపమాన మగుభవదీయకుచయుగ్మకంబు మదీయవక్షఃప్రదేశంబున హత్తుకొని నిరతిశయానంద మనుభవింప స్రష్ట నిన్ను సృజించినదాదిగఁ గాంక్షించియుండు నీప్రేమభిక్షువునకుఁ బ్రేమభిక్ష నిడి కృతార్థునిఁ జేయుము.

(అహల్య చకితయై సంతోషమున సుందరమందహాసవదనారవిందయగుచు) ఓహో! తెలిసె అమరవల్లభా! సుస్వాగతము! పెద్దకాలమునుండియు ఎవరిసందర్శనసంభాషణసంయోగమున కీప్రేమదాసి యపరిమితానుతాపము ననుభవించుచున్నదో యాదేవసామ్రాట్టువా! మహాభాగ్యము!

శా. నీమూర్తిం గనులారఁ జూడ మదిలోనిండారుఁ గాంక్షావ్రజం
బేమాత్రంబును గాననీయక ప్రభూ! యెంతేనిగష్టంబుతో
నేమాడ్కిం గడుపంగఁ గల్గితినొ నే నిన్నాళ్లు నీరాకకై

స్వామీ! నీ వరుదేరఁ గాంచి ముదమ్మున్ । స్వాంతంబున్
బొందితిన్.

సర్వదేవతా శిరఃకోటీరమణికాంతి నివాళితపాదపీఠుం డగునిర్జరేశ్వరునకుఁ బ్రణయదాయిని యగుభాగ్య మబ్బినది. (ఇంద్రుఁడు గౌతమరూపమును వీడి నిజస్వరూపమును ధరించి అహల్యను కౌఁగిలించుకొని) ప్రణయినీ! నీప్రజ్ఞావిశేషమునకు మెచ్చితిని. నీమంజుల మనోజ్ఞ వాగమృతంబుఁ గ్రోలి మదీయశ్రోత్రపుటంబులు ధన్యములైనవి. ప్రేమరసార్ద్రంబగు నీహృదయంబును, త్రిలోకదుర్లభంబగు నీసౌందర్యంబును సన్నిక్షణంబున నుండి నీపదదాసునిఁ జేసినవి. ఏభిక్షుగోరి త్రిదశేశ్వరుఁడు నిన్నర్థించెనో యాప్రేమభిక్ష నిడి భాగ్యసంపన్నునిఁ

అహల్య — ప్రణయేశ్వరా! నీవు నాయందలి ప్రేమచే సట్లను చున్నవాఁడవుగాక నేనెంతదానను.

చ. సకలకలావిలాసినులు । సారసలోచన లప్సరాంగనల్
ప్రకటితప్రేమచే నెవని । పజ్జను జేరఁగ వాంఛఁగొందు రా
సకలసుపర్వనేత యిటు । స్వాంతము రంజిల ప్రేమభిక్షకై
యకుటిలవృత్తి వేఁడెడు । నహల్యను భాగ్యము గాదె వల్లభా!

ఇంతకాలమున కీయహల్య జ్ఞాపకమునకు వచ్చినది కాఁబోలును. పాపము. నిరంతరరంభాద్యప్సరస్త్రీజనపరివేష్టితునకు మముబోంట్లు మరపువచ్చుట తప్పేలయగును?

ఇంద్రు.—విద్రుమాధరా! ధాత నిన్ను సృజించినప్పటి నుండి నామనం బనవరతము నీయందే హత్తియున్నది. నాయవస్థ చెప్పఁజాలను.

చ. అతివ! నినుంగనుంగొనినదాదిగ సౌఖ్యమెటుఁగ కుమ్మరియుం మతిచెడినట్టులుందు; నొకమాటును జేరఁగఁబోను నందనం బతిశయవకాను దాపమని; యచ్చరపిండులయాటపాటలుం గుతుకముఁజేయ వెంతయును గోమలి నీపయిఁగూర్మి పెంపునన్.

దైవయోగంబుచే మన మింతపఱకును గలిసికొనలేక పోయితిమి. నీవియోగమునకై నేనింతకాలమునుండియు ను దపించుటయేగాక, సుకుమారహృదయవగు నిన్నల యింపఁజేసిన యపరాధమునకు నన్ను వశ్యము శిక్షిం పుము. ఇఁక నిట్టి తప్పొనర్పకుండ నవమృణాళసన్నిభంబు లగు నీబాహువు లీదండార్హునికంఠమునఁ బెనవైచి వజ్ర పంక్తింబోలు నీదంతములచే నాయధరపీడన మాచరించి శాసింపుము. శరజ్యోత్స్నాలతంబోలు నీతనువల్లరిచే నీయపరాధితనువును జుట్టి బంధించి సురతయుద్ధంబునఁ బెనఁగి విజయోపేతవగుము. అట్లైన బ్రహ్మామానసకాసా రసముద్భూతా హాల్యానామసరసిజ మకరందమాన నీయింద్రనామకేందిందిరము దివినుండి దినదినంబును దిగి రాఁగలదు.

అహ.—(నవ్వుచు ఇంద్రునిభుజముపై చేయివైచి) మనోహరా! త్రిభువనరసికావతంసుడవగు నీకుఁ దగినట్లే చెప్పితివి. రమ్ము. లోనికేగుదము. నీవన్నట్లు నిన్ను శిక్షింపక విడువనుసుమా? (ఇరువురును ఆశ్రమాంతర్భాగమునకు నిష్క్రమింతురు. కొంతసేపైనతరువాతఁ బ్రవేశింతురు).

అహ.—ప్రాణేశ్వరా! పోయివచ్చెదరా? ఈదాసికిఁ బునర్దర్శన భాగ్య మెప్పు డనుగ్రహించెదరు?

ఇంద్రు.—(అహల్య చెదరినముంగురులు సవరించుచు) మనోహరీ!

చ. అతివ! కృతార్థతం గనఁగ నందితి నీదయచేత నెంతయే
నతిశయసౌఖ్యవారినిధియం దవగాహన మాచరించితిన్
అతులితవైభవోల్లసితయౌ సురలక్ష్మినినైన నప్సరో
వితతినినైన నిట్టి కడుఁబ్రేమగుసౌఖ్య మెఱుంగఁ బ్రేయసీ!

సమయము ననుసరించి వచ్చుచుఁ బోవుచుందును. నీవి యోగ మొక్కనిముసమైన నొక్కయుగమువలె నుండు నన నాకుఁ జెప్పవలయునా?

అహ.—మనోహరా! సంతుష్టనైతిని. పెద్దకాలంబునకు మదీప్సితం బీడేఱినది.

శా. ధన్యంబయ్యెను నాదురూపము ప్రభూ! ధన్యత్వముం జెందె నీ
మాన్యత్వంబునఁ జేసి యౌవనము సన్మానంబుతో నీవు న

న్న న్యాలోకన ప్రేమవీక్షణముచేఁ నాలింగనం బిచ్చి య[మున్.
నోన్యన్యంబుగ రమియింపఁగాంచితిమి ధన్యంబయ్యె నాజన్మ

చరితార్థురాలను. భృశకోపనుఁ డగుగౌతముఁ డరు
దెంచు వేళ యైనది. సమయసముచితప్రవర్తితులముగాక
తప్పితిమేని మనభవిష్యత్సౌఖ్యమున కంతరాయంబు.
వాటిల్లు. నన్ను రక్షింపుము నిన్ను నీవు రక్షించుకొనుము.
తడయుట ప్రమాదము. పోయిరమ్ము.

ఇంద్రు.—ప్రియా! పోయివచ్చెదను. సెలవొసంగుము. (ఇరు
వురును కౌఁగిలించుకొందురు.) ఇంద్రుఁడు గౌతమరూప
మును ధరించి రెండడుగులు నడచును అహల్య
ద్వారముచెంత నిలిచి ఇంద్రునిదెసఁ జూచుచుండును.
గౌతముఁడు ప్రవేశించును.)

గౌత.—(ఇంచుక దూరముననుండి తనరూపమున నున్న
యింద్రునిఁ జూచి ఆశ్చర్యమున బొమలు పైకెత్తి
దివ్యదృష్టిం జూచి కోపమున) ఓరా! తెలిసె. ఈనిర్జ
రాధముఁ డెంతటిదుష్కృత్య మాచరించె.కామాంధుఁడై
కన్నుమిన్నెఱుంగక యిక్కల్మషాధముఁడు ప్రళయ
కాలసముద్భూతపరమేశ్వరఫాలలోచన ప్రభవప్రజ్వలిత
పావకునిపరిష్వంగ మాచరించెను (సమీపించి).

శా. ఓరీ దేవకులాధమా! యదితిగర్భోద్భూతహాలాహలా
సారాచారవిచారదూర! ఖల! దుష్టా! పాప! నీచాశయా!

కారేమున్నలయింద్రు లెందఱో యిటుల్ కారాని కార్యంబు
వా రెవ్వారును జేసిరే పరసతీవ్యాసంగముల్ నీవలెన్. [లగ

మదాంధీభూతచేతస్కుండవై స్వర్గసంపన్నాంధంబునఁ గన్నె యుంగక, కళంకరహితుండ నగు నాయద్ధశరీరంబును మహాపాపపంకిలంబునఁ బడవైచితివి. మహాపమానదుఃఖంబులు నాకుఁ గలుగఁజేసితివి. ఏదుష్టకామంబున నిట్లొనర్చితివో తత్ఫలంబుగ నీయండములు తెగి పుడమింబడి విగతపీస్యుండ వయ్యెదవుగాక! నీకు శత్రుండఁగాని నన్ను కారణంబుగ నవమానించినపాపంబున నీశత్రువులచే నీవవమానితుండ వగుదువుగాక. మదీయార్ధశరీరము మాలిన్యమొనరించినకతంబున నీశరీరము తేజోవిరహితమై మాలిన్య మొందుఁగాక!

(ఇంద్రుఁ డదృశ్యుండగును, గౌతముఁడు అహల్యను సమీపించి)

గౌ.—కులటా! యెంతపనిచేసితివి?

ఉ. ఓసి దురాత్మురాల! యిపు డొప్పనిదుష్కృత మాచరించినా
వాసిని వీసపుచ్చితివి వాయువుభక్షణ మాచరించుచుఁ
గాసికి నోర్చి యెవ్వరికిఁ గానఁగరాక జడంబవై కళం
బాసి ధరాతలంబునన మ్రగ్గుచుఁ బాపఫలంబునొందుమా.

(అహల్య వడఁకుచు గౌతమునిపాదములపైఁబడి చేతులు జోడించి) దయామయా! అజ్ఞానినై నేఁజేసినయపరాధ

మును మన్నింపుము. పెక్కువత్సరములు నీకు సహధర్మ చారిణినై సుఖదుఃఖంబు లనుభవించిన యీదీనురాలిని గరినాతకరిసం బగు ఘోరశాపరూపమహాకూపమునఁ శాశ్వతముగఁ బడవైచుట కరుణామయులరగు మీకుఁ దగదు ప్రభూ! కరుణింపుము. మహాత్ములు దీర్ఘక్రోధ నులుగారు ఈపిచ్చుకపై బ్రహ్మాస్త్రమును బ్రయోగించి తిరి ఉపసంహరింపుఁడు శాపావధి ననుగ్రహింపుఁడు. (గౌతముఁడు ఇంచుక శాంతించి నిట్టూర్పువిడిచి) పడఁతీ! పరమేష్ఠిమానసోద్భవవై మునిశార్దూలుం డగుగౌత ముని సహధర్మచారిణివైయుండియు నెట్టి నికృష్టకర్మ మాచరించితివి. ఆహా విధీ! యెంతటివార లెట్టివార గుదురోగదా? అహల్యా! నాశాపము వ్యర్థముగాదు. అనుభవించియే తీఱవలయును. అయినను నింతకాలము నాకుఁ బరిచర్య చేసిన యిల్లాలివగుటచేఁ గరుణించితిని. శాపావధి యొఱిఁగింతును (దీర్ఘాలోచనముచేసి)

తే. రవికులంబున నెపుడు నారాయణుండు
రాముఁడై పుట్టి యిచటికి రాఁగలండొ
యపుడె యాదేవుదివ్యపాదాబ్జవింద
రేణువులు సోక మునుపటిరీతి యొదవు.

అదియే నీకు శాపాంతము. అప్పటినుండి తొల్లింటియట్లు ప్రకాశింతువు.

ఆహ.—హా రామా ! శ్రీరామా ! (పడిపోవును.)

గౌ.—శ్రీరామచంద్రమూర్తి పాదస్పర్శచే నీ యాశ్రమము పవిత్రమగువఱకు నేనును నాశిష్యులతోఁ గదలి హిమవత్పర్వతపాదంబునం దుండెదముగాక!

(నిష్క్రమించును)

## ద్వితీయాంకము చతుర్థరంగము

(ఇంద్రుఁడు విషాదముతోఁ బ్రవేశించును)

ఉ. ఏల విధాత నాఁ డటులఁ నింతి సృజించెను; దాని జూచి నే
నేల భ్రమించినాఁడ; నటులేకలమునీశ్వరుఁ డడ్డువచ్చి నా
యోలము గెల్చి కాంతగొనియుండఁగఁ జూచి సహింపలేక దు
ష్కాలము దాపురింప నిటుకష్టము లొందఁగనైతి నక్కటా!

ఓహో! విధి యెంత బలవత్తరమైనది. ఎంతటివారికిని దాఁటరానిదని యిప్పుడుగదా తెలిసినది. భవిష్యత్కాలగర్భమున నేమున్నదో యెవ్వరెఱుంగుదురు. ఆశాపతీవ్రత నన్నెంతగా బాధించుచున్నది. అండవిహీనుండనగునాకు మేషాండములు గలిగ్గెనవి (శరీరము చూచుకొని) నాశరీరమున కొదవిన యీమాలిన్య మెట్లుపాయును? ఇంక రానున్న దేమి? నేను నాశత్రువుచేఁ బరాభూతుండ నగుటయా? అదియును దగ్గఱకే వచ్చుచున్న దేమో? దశవదనుండు ధాతను మెప్పించి యనేక

వరంబులుపడసినట్లు మొన్న నే తెలిసినది. వాఁడు త్వర లోనే నాపైకి దండెత్తునేమో? కానున్నది కాక మానదు. నిర్జరేశ్వరుండనగు నాగతియే యిట్లున్నది. పాప మాయబలగతి యేమైనదో (ఆశ్రమమువంక జూచి) అహల్యా! అహల్యా! ఎందున్నావు? అయ్యో! నీచప్రాణులుసహితము రెండుకన్నులు కలిగి తమకుఁ బ్రియమగుపదార్థములఁ జూచి యానందించుచుండ సహస్రాక్షుండనయ్యు నిన్నుఁ జూడలేకున్నాను. అయ్యయ్యో! ఆమధురవిగ్రహ మెచ్చటను గన్పడదే. ఏమైపోయినది? (ఆలోచించి) భూతముల కగోచరయై యుండునఁట. వాయుభక్షణంబుఁ జేయుచు, శీతవాతవర్షా తపంబులచే గాసినొందుచు అకటా! ఒక్కదినముగాదు పెక్కువత్సరము లెటులుండుట. ఏమనుకొనుచున్నదో! ఎంతబాధనొందినదో? ఓదార్చుటకైన వీలులేదు. ఆయ వస్థఁ దలపోసిన నొడలు గంపమొందుచున్నది. గుండె నీఱగుచున్నది. కట్టా! దీనికంతకును గారణ మెవరు? నేను - ముమ్మాటికి నేనే - దుర్బుద్ధి! ఇంద్రహతకా! యెంతపనిచేసితివి. అశుభము శుభము నెఱుంగని నవశి రీషకుసుమకోమలాంగి యగునబలను, గర్భావాసక్లేశమైన నెఱుంగనిపవిత్రను, సౌఖ్యజీవితను, సర్వలోకసంభావ నీయసౌందర్యాధిదేవతను, నీస్వార్థమునకై మట్టిపాలు జేసితివే. ఏల నీజన్మము కాల్పనా? పాప మాయబల

# అహల్య

త్రిలోకేశ్వరుండవని నీప్రణయమును సుకుమారస్నే హార్ద్రహృదయమునఁ దిరస్కరింపనేరక యిట్టి యిక్కట్టు లకు లోనయ్యెను. ఇప్పు డేమిచేయుదును. నాచేత నేమియుఁ గాకున్న దే. స్వర్గరాజ్య మున్న నేమి ? కల్ప వృక్ష మున్న నేమి ? చింతామణి హ_స్తమం దున్న నేమి ? ఇవి అన్నియు నీనెత్తినఁగొట్టుకొనుటకా? నీప్రార్థనత్రోసి పుచ్చలేకయో, నీయందలి ప్రేమకతంబుననో, విపద్దశాం బుధింబడి మునిఁగిపోవుచున్న యొకయబల నుద్ధరింపలేని దీనదశావిష్టుండవగు నీవుండిననేమి ? మండిననేమి ? ఈమనోవ్యథను భరింపఁజాలను. (బాధ నభినయించి) ఏమీబాధ ప్రళయకాలసమయఫాలలోచనపావకచ్ఛటల మ్రింగినను హృదయ మింతతపించుచుండ దేమో ? స్పర్శ మాత్రంబున సర్వజీవనకరాయుగ్రహాణసమర్థతల్పరంబగు హాలాహలము మ్రింగినను నుదర మింతకలఁతఁజెందియుండ దేమో ? సరిత్సముద్రపర్వతకాననసహితయగు నీవసుం ధర హటాత్తుగ నాతలపైఁ బడియుండినను శిర మింత దిమ్మెక్కి యుండియుండ దేమో ? భూజలాగ్నివాయ్వా కాశాహంకారమహత్తుల నొక్కుమ్మడిఁ గబళించు మహా మాయావిజృంభణంబుచూచినను నాకన్ను లిట్లు తిరుగు చుండి యుండవేమో ? వృత్రాసురునిచే మ్రింగఁబడి వానియుదరము ప్రవేశించినప్పుడును నాకిట్టిదైన్యదశ లేదే. దుర్భరము! దుర్భరము! దుర్భరము! (మూర్ఛిల్లును.

నారదుఁడు నారాయణస్మరణచేయుచుఁ బ్రవేశించును.
ఇంద్రుఁడు మూర్ఛనుండి లేచును.)

ఇంద్ర.—నారదమునీంద్రా! అభివాదనములు

నా.—శుభమస్తు.

ఇంద్ర.—మునిచంద్రమా! ఏమిశుభము?

నా.—అమరేశ్వరా! యేల యట్లనుచుంటివి?

ఇంద్ర.—మునివర్యా! ఏమిచెప్పుదును? నావలన నహల్య కెట్టి విపత్తుగలిగెనో వినియుందురు. మహాత్మా! ఆమె నుద్ధరించుట యెట్లు? సర్వజ్ఞుండవగు నీవెఱుగనియర్థ మేమున్నది? ఏదేని మార్గమున్న నెఱిగింపుఁడు శరణాగతుఁడను.

నా.—దేవేంద్రా! అహల్యాశాపాంతమా? అదియును గౌతముఁడే యెఱిగించియున్నాఁడు. అతనివాక్యమున కన్యథా యెవరేమియుఁ జేయఁజాలరు.

ఇంద్ర.—స్వామీ! గౌతముఁడు శాపావధి యెట్లొసంగెను?

నా.—అది యొకపరమరహస్యము. శ్రీమన్నారాయణుఁడు మనుష్యాకారమునఁ బుడమిపై శ్రీరామనామమున నవతరింపఁగలఁడు.

ఇంద్ర.—బ్రహ్మపుత్రా! నారాయణుఁ డెవ్వనిగర్భమున నెంతకాలమున కవతరింపఁగలఁడు?

నా.—ఇంద్రా! అది నేనును జెప్పరానిదే. అట్టిసమయము తప్పక రాఁగలదు. అప్పు డహల్య శాపవిముక్తయై లేచును.

ఇంద్రు.—దేవా! పెద్దకాలము పట్టునేమో!

నా.—అవును. అది యొకమహావిశేషసమయము. ఆకాలము వంటికాలము మఱొకప్పు డుండబోదు. ఆయవతారసమయమున, సంసారపారావారము నుత్తరించి పరమేశ్వరుని సన్నిధినిజేరఁ బరిపక్వస్థితినొందినజీవులు జన్మమునకు రానున్నారు. మహనీయులగు వసిష్ఠాదిఋషులు ఆదివ్యమంగళవిగ్రహమును జూచుటకై తదీయదివ్యాద్భుతలీలలయందుఁ బాత్రులై యుండుటకును నిరీక్షించియున్నారు. ఆదృశ్య మసమానము. అనన్యము. అహల్యనుగుఱించి నీవు విచారపడకుము. ఆసమయమున ముక్తురాలగును.

ఇంద్రు.—ప్రభూ! నాకుఁ దరుణోపాయములేదా? శరణాగతుండ నగు నన్నుద్ధరింపుము. నాకొదవిన యీమాలిన్యము మానుటెట్లు!

నా.—ఇంద్రా! ఏల యట్లు నిరుత్సాహపడెదవు? రోగమున్నప్పుడే యౌషధ మున్నది ఎట్టిపాపులకును దరణోపాయ మున్నది. నీసంగతిఁ జెప్పనేల.

ఇంద్రు.—అట్లైన అనుగ్రహింపవేఁడెదను.

నా.—దేవేంద్రా! అహల్యయు, నీవును, నొక్కటే యపరాధమాచరించితిరి. ఆమెకు శ్రీరామచంద్రానుగ్రహమున

శాపాంతంబైన నీకును తదనుగ్రహమేతరణోపాయము.

ఇంద్రు.—శ్రీరామచంద్రుఁ డవతరించుటకు బహుకాలము పట్టునుగదా? నన్నేమి చేయుమనెదరు? క్రతువిధాన మేమైననున్నదా?

నా.—దేవరాజా! వెఱ్ఱివానివలెఁ గన్పడుచున్నావు. క్రతువిధానముకన్నను మిన్నయగు శ్రీరామనామ మవతరించినదికదా? శ్రీరామనామమాహాత్మ్య మీవెఱుంగవు వినుము.

సీ. శ్రీరామనామంబు శివతరం బపవర్గ
కారణంబు విపన్నివారణంబు
సర్వపాపహరంబు సజ్జనానందంబు
సకలకామదుఘంబు సత్యయుతము
వివిధమాయాజాల విధ్వంసకరణంబు
శాత్రవద్వయిజైత్ర సాధనంబు
దుర్భరదారిద్ర్య దోషాపహరణంబు
నఖిలరోగనివార ణౌషధంబు
తే. అపరిమేయమహామహిమాన్వితంబు
నైన యేతన్మహత్త్వంబు నభినుతింప
నలవి యగునయ్య! నాకైన నలువకైన
శేషునకునైన శాంకరీ శివులకైన.

ఇంద్రు.—మునీంద్రా! అట్లైనఁ గృతార్థుండనే.

నా.—ఇంద్రా! ఇంకను సందేహించుచున్నాఁడవా? వినుము చెప్పెదను.

ఉ. దీనుల సాధులం గురుల ధిక్కరణం బొనరించినట్టిదు
ర్మానియు వంచకుండు పరమానిని బల్మినిబట్టినట్టివాఁ
డైనను రామనామమును నంచితభక్తి జపించెనేని య
వ్వాని యఘంబులెల్లఁ జెడు వాసవ! నమ్ముము నెమ్మనంబునన్

ఇంద్రు.—మునివల్లభా! ధన్యుఁడను. "శ్రీరామ" యనుదివ్య నామమును అహోరాత్రములు నేమరక జపించెదను. మీకు సర్వదా కృతజ్ఞుఁడను.

నా.—దేవపతీ! నీకు శుభమగుగాక. నమ్ము పోవుదము. (ఇరువురును నిష్క్రమింతురు.)

# తృతీయాంకము - ప్రథమరంగము

[గౌతమాశ్రమము విశ్వామిత్ర శ్రీరామలక్ష్మణులు క్రమముగాఁ బ్రవేశింతురు.]

శ్రీరాములు.—గురుదేవా! ఆకనఁబడువన మెవ్వరిది. అది యొక మునియాశ్రమమా?

విశ్వా.—శ్రీరామచంద్రా! అది గౌతమాశ్రమము. కుమారా! దీర్ఘప్రయాణమున నీవు కడుబడలియుందువు. అచ్చట యించుక విశ్రమించిపోవుదము.

శ్రీరా.—మునిచంద్రా! మునికులాశ్రమ సంచారసంజనిత సంతోషమునను మీరొసంగిన బలాతిబలానామకదివ్య విద్యాప్రభావంబునను నా కలసటయే లేదు. మఱియు నుత్సాహాతిశయంబున నున్నాను. నా సోదరుఁడును నట్లె యుండునని తోఁచును.

లక్ష్మ.—చిత్తము.

విశ్వా.—శిష్టరక్షణమును, దుష్టశిక్షణమును బరమార్థమని యెంచెడిరఘుకులప్రదీపకులకు మీకట్లె తోఁచును.

శ్రీరా.—(దృష్టి నిగిడించి) మునీంద్రా! ఆయాశ్రమముఁ జూడుము.

సీ. చంద్రుండు లేనట్టి శార్వరియునుబోలె
సారసంబులులేని సరసిమాడ్కి-

పతిఁబాసియున్నట్టి ॥ సతిజీవితముభంగి
పుంభావరహితుఁడౌ ॥ పురుషుకరణి
వాక్సతీ శూన్యమౌ ॥ వదనంబుకైవడి
దినపతిఁ గనరాని ॥ దినముపగిది
దయలేనిమనుజుని ॥ ధర్మంబుపోలిక
బర్హంబు లేనట్టి ॥ బర్హిరీతి
కాంతిఁగోల్పడినట్టులఁ ॥ గనఁగనయ్యె
హృదయమార్ద్రంబు నగుచును ॥ గృపఁజిగిర్చె
నిట్టులగుటకు హేతు విదియ్యది యటంచుఁ
బలుకవే మునిచంద్రమా! ॥ పరమకరుణ.

విశ్వా.—కుమారా! నీవన్నది యథార్థము. ఇచ్చట మనుష్య సంచారము లేదు. కొంతకాలము క్రిందట ముల్లోకముల యందలి విజ్ఞానవంతులహృదయములను కల్లోలితముఁ జేసిన యొకానొకమహాద్భుతఘటన మిందు సంఘటిల్లినది. అప్పటినుండియు నీయాశ్రమము నిర్జనమై యున్నది.

శ్రీరా.—గురూత్తమా! ఆమహాద్భుతఘటన మేదియో వినఁ గుతూహలుఁడనై యున్నాను. వినఁదగునేని అనుగ్రహించి సెలవిండు.

విశ్వా.—తొల్లి విరించి యపూర్వసౌందర్యవతియగు నొకలలనారత్నమును సృజించి యహల్యాభిధానంబిడిన, నామె సౌందర్యమునకు నోడి యింద్రుఁడు తనకామె నిమ్మని

ప్రార్థింపఁ జతురాననుఁ డాకన్యను దనపరీక్షయం దుత్తీర్ణుఁడైన గౌతమున కిల్లాలుగ నిచ్చె. కొంతకాలము జనిన వెనుక గౌతముఁడు స్నానార్థమై యింటలేనితఱి నింద్రుఁడు గౌతమవేషమున నాశ్రమముఁ జొచ్చి అహల్యను గామార్థియై వేఁడ సురపతి యని యెఱిఁగి యామె యాతనియభీష్టంబు దీర్చె. అది యెఱింగి గౌతముఁ డహల్యను వాయుభక్షణంబుచేయుచు జడస్థితి భూతముల కగోచరవై పడియుండుమని శపించె నాఁడు మొదలుగ నహల్య భర్తృదత్తశాపోపహతయై పడియున్నది. ఇంద్రుఁడును శపింపఁబడియె నాఁడే గౌతముఁడును నతని శిష్యులును నీయాశ్రమము వీడి హిమవత్పర్వతపాదంబునకుఁ దపంబొనర్ప నేగిరి అప్పటినుండియు నీవనంబు నిర్జనంబై యున్నది.

శ్రీరా.—మహాత్మా! పాప మాయహల్యగతియేమి? ఆమెకు శాపాంతములేదా? బ్రహ్మమానసపుత్త్రియయ్యు నామె కెట్టిదుర్గతి సంప్రాప్తమైనది. గురుదేవా! ఆమెపశ్చాత్తప్తురాలై యుండనోపు. అదియునుగాక, తప్పునకంటెఁ గఠినతరంబగుశిక్షయు ననుభవించినది. కర్మఫల మనుభవించినవారు పరిశుద్ధులు. గాన, యహల్యాదేవికి శాపాంతంబైన బాగుగనుండును.

విశ్వా.—(సంతోషముతో) శ్రీరామచంద్రా! అహల్య ధన్యురాలైనది. పరంధామునిపరమకృపకుఁ బాత్రురాలైన

యాంమె, పాపమునకును శాపమునకునుగూడ దూర మైనవి. ఇంచుకసేపటిలో సర్వము పరిష్కరింపఁబడును.

(శ్రీరామలక్ష్మణవిశ్వామిత్రులు నడచుచుండ ఆశ్రమ సమీపమున నొకచోట నాకస్మికముగ విముక్తకేశయు వినమ్రయుఁ, బ్రాంజలియునై యహల్య ప్రత్యక్షమగును అహల్య శాపవిముక్తయై)

దండకము. శ్రీరామ, చంద్రా! కృపాసాంద్ర! సాంద్రంబులౌ పాపరాసుల్ వెసన్ రూపుమాపంగ నోపంగ శక్యంబులై నట్టి నీపాదపద్మంబులన్ గొల్తు, శ్రీరామరామా! త్రిలోకాభిరామా! పరంధామ! చేయంగరానట్టికర్మంబులన్ జేసి జీవుల్ తగన్ వారిదేహంబుకేనిన్ మనోబుద్ధులందేనికేనిన్ వెసన్ గంద్రు మాలిన్య మద్దానినే పాపమంచున్ మహాప్రాజ్ఞులైనట్టి మౌనుల్ వచింపంగ వింటిం గదే, దేవ! నాయందదేదైన సంప్రాప్తమైయుండి యున్నన్ భవత్పాదపద్మంబులన్ గాంచుటన్ జేసి యానిష్టయోగంబుచేతం శిలన్ వీడి మేలైనబంగారమే వేలుగా నిల్చుమాడ్కిన్, మహాశుద్ధతం బొంది తొల్లింటిచైతన్యమున్ బొందఁగాఁ గంటి; నోదేవ! నిన్ సోకినన్ స్థావరంబైనముక్తంబగున్ నీదునామంబు భావించినన్ పామరుండైన బ్రహ్మర్షి పూజ్యుండగున్ సర్వలోకేశసంపూజితా! దేవదేవా! నమస్తే నమస్తే నమః.

విశ్వామిత్రమునిచంద్రా! శ్రీరామలక్ష్మణుల నాయాశ్రమంబునకుఁ దెచ్చి శాపవిముక్తురాలింజేసితివి. జీవితపర్యంతము నీకు నమస్కరించెద.

శ్రీరామలక్ష్మణులు.—అమ్మా! అహల్యాదేవీ! నమస్కరించుచున్నాము.

అహ.—శ్రీరామభద్రా! నీవు నమస్కరించుటయా?

ఉ. ఓరవివంశదుగ్ధకలశోదధిచంద్రమ! లోకరక్షకా!
శ్రీరఘురామ! నీదుపదరేణులవం బది సోకినంతనే
నీఁయిపోయెఁ గల్మషము నిర్మలనైతిని దొంటియట్టు లో
నీరజసంభవాదినుత! నీకిదె మ్రొక్కెద భక్తవత్సలా!

పరమపురుషా! పరమేశ్వరా! దయాంభోనిధివన్నమాట సార్థకమాయెను. ధన్యనైతిని. (గౌతముడు ప్రవేశించును. అందఱు నమస్కరింతురు.)

గౌతముఁడు.—విశ్వామిత్రమునిచంద్రమా! నీ కాజన్మాంతము కృతజ్ఞుఁడను. కరుణాళుండవై శ్రీరామచంద్రుని నాయాశ్రమమునకుఁ దోడ్తెచ్చి నన్నును నీయహల్యను జరితార్థుల జేసితివి. (శ్రీరాముని జూచి) శ్రీరామా! త్రిలోకాభిరామా! పరంధామా! లీలామానుషజన్ముండవగు నీవు అపారకృపాళుండవై నాయాశ్రమమునకు విచ్చేసి నాగృహిణిని శాపవిముక్తురాలింజేసితివి. మానిమాన

సములవిహారించు నీదివ్యపాదస్పర్శముచే నాయాశ్రమ మును నన్నును బవిత్రులఁజేసితివి.

శ్రీరా.—గురుదేవా! యిదియేమి? మీరు నన్ను బరతత్త్వమను చున్నారు.

విశ్వా.—శ్రీరామా! నీవు మనుష్యమాత్రుఁడవుగావు, భవదీయమాయావిశేషమున నిన్ను నీవెఱుంగనియట్లు లోకవిడంబనార్థము మనుజశరీరధారివైతివి. నీతత్త్వ మిదియని పూర్ణముగ నెఱుంగ నేరికిఁ దరముగాదు. అదియటుండనిమ్ము. ఈవిషయము మునుముందు బ్రహ్మాదిదేవగణము నీయెదుటఁ బ్రసంగింపఁగలరు. నీతత్త్వ మించుక నేనును నీగౌతముఁడును వసిష్ఠుఁడును మఱికొందఱును మాత్ర మెఱుంగుదుము. నీకరుణావిశేషమున నీగౌతమునకు జిరకాలమునకు సతీసమాగమంబైనది. ఇంక మనము పయనింతము

శ్రీరా.—(గౌతముని జూచి) మునీంద్రా! ఇమ్మహాదేవిని బరిగ్రహించి సుఖంబున నుండుఁడు. మేము పోయి వచ్చెదము. సెలవిండు.

గౌత.—రఘురామా! మాయాతిథ్యమును స్వీకరించి యించుక విశ్రమించి పిమ్మటఁ బయనింపుఁడు. ఇందుకు విశ్వామిత్రుఁడును ననుజ్ఞ నియ్యఁగలఁడు.

విశ్వా.—మునిచంద్రా! మీయాజ్ఞానువర్తులము. మీ రీమె తోఁగూడ మాకాతిథ్యమిందు. ఈమె మహాపవిత్ర.

గౌత.—విశ్వామిత్రా! మీయొక్కయు శ్రీరామునియొక్కయు నాజ్ఞానుసార మీకాంతను స్వీకరించితిని. (అహల్య గౌతముని పాదములపైఁబడును. గౌతముఁ డామెను గ్రుచ్చియెత్తి) నీవు కల్మషరహితవై మునుపటి యట్లు నాకు సహధర్మచారిణివై వెలయుదువుగాక!

అహల్య.—కృతార్థురాలను.

విశ్వా—తథాస్తు.

(దేవతలు దివినుండి పుష్పవర్షముఁ గురిపింతురు)

శ్రీరా—(గౌతముని జూచి) మహానివర్యా! నీమహోదార హృదయమునకు నమస్కృతులు, మీ రీమెను గరుణించుటం జేసి సంతసించితిని.

గౌ.—శ్రీరామా! సోదరసహితుండవగు నీవు సాకేతపుర గామివై మార్గంబునఁ జనుచుఁ జిరకాలభార్యావిరహితుండ నగునాకు సతీలాభ మొదవించినపుణ్యమున నీవును మార్గమధ్యంబున దారాలాభమును బొందుదువు గాక!

అహ.—శ్రీరామా! అనన్యదుర్లభము, త్రిలోకపూజితయు నగుసతీమణి నీకిల్లాలగునుగాక!

విశ్వా.— తథాస్తు.

భరతవాక్యము

గౌ.—అన్యకాంతాసంగ । మంటక జగమెల్ల
న్యాయమార్గంబున । నడచుఁగాక!

అహ —పరపురుషాసక్తిఁ । బాసి నారీలోక
మతిభక్తిపతులను । నెఱయుఁగాక!

విశ్వా.—శ్రీరామభక్తిచేఁ । జిరకాలపాపముల్
ఖిలముగా జగము సుఖించుఁగాక!

శ్రీరా.—ధర్మంబుఁ బెంప నధర్మంబు నడఁగింప
దీక్షచే జీవులు । దిరుగుఁగాక!

లక్ష్మ.—శాపమోక్షంబుఁ గాంచిన । సతి యహల్య
చరిత విని దృశ్యముగఁ జూచి । చదివినట్టి
వ్రతియు నటనం బొనర్చిన । మానవాళి
సర్వపాపముల్ దప్పక । సమయుఁగాక!

శ్రీరామచంద్రార్పణమస్తు

ఓం శాంతిః శాంతిః శాంతిః

---

చెన్నపురి ... రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
"వావిళ్ల" ప్రెస్సున ముద్రితము.

